# ఆర్యోద్దేశ్యరత్నమాలా

1. **ఈశ్వరుడు**:-ఎవని గుణ, కర్మ, స్వభావము, స్వరూపము సత్యమే అగునో, కేవలము చేతనమాత్ర పదార్థము, అద్వితీయుడు, సర్వశక్తిమంతుడు, నిరాకారుడు, సర్వత్ర వ్యాపకుడు, అనాది, అనంతుడు-ఇట్టి సత్యగుణములు గలవాడు, అవినాశము, జ్ఞానము, ఆనందము, శుద్ధత, న్యాయము, దయ, జన్మాభావము మొదలగు స్వభావములు గలవాడు, జగత్తును ఉత్పన్నము చేయుట, పోషించుట నాశముచేయుట, జీవులకు పాపపుణ్య ఫలములను యథాతథముగ ప్రాప్తింపజేయుట అను కర్మలు గలవాడు అతనినే **ఈశ్వరుడు** అందురు.

2. **ధర్మము** :- ధర్మస్వరూపము-ఈశ్వరాజ్ఞను యథార్థముగ పాలించుట, పక్షపాతరహిత న్యాయము సర్వహిత మొనర్చుట. ప్రత్యక్షాది ప్రమాణములచే బాగుగా పరీక్షింపబడినదై వేదోక్తమునందున మనుష్యులందరకును ఇదొక్కటే అంగీకరింప దగినది. దీనినే **ధర్మము** అందురు.

3. **అధర్మము** :- ఈశ్వరాజ్ఞను వదలి పక్షపాతియై, అన్యాయకారియై, పరీక్షింపక తన హితమునే చేసికొనుట, అవిద్య, హఠము, అభిమానము, క్రూరత్వము మున్నగు దోషములతో కూడియుండుట వలన వేదవిద్యకు విరుద్ధము. కావున మానవులం దరికి త్యజింపదగినది. ఇదియే **అధర్మము** అనబడును.

4. **పుణ్యము**:- విద్యాది శుభగుణముల దానము, సత్యభాషణాది సత్యాచరణము చేయడమే **పుణ్యము** అందురు.

5. **పాపము**:- పుణ్యమునకు విరుద్ధమైనదియు మిథ్యాభాషణా దులును **పాపము** అనబడును.

6. **సత్యభాషణము**:- అసంభవాది దోషములు లేకుండ సదా తన ఆత్మలో నున్నట్లుగా పలుకుట దీనినే **సత్యభాషణము** అందురు.

7. **మిథ్యాభాషణము** :- సత్యభాషణమునకు విరుద్ధమైనది **మిథ్యాభాషణ** (అసత్యభాషణము) అనబడును.

8. **విశ్వాసము**:- మూలార్థము, ఫలము నిశ్చయముగ సత్యమే అయినది దానినే **విశ్వాసము** అందురు.

9. **అవిశ్వాసము**:- విశ్వాసమునకు నిరుద్ధమైనది. సత్యమైన అర్థము లేనిది **అవిశ్వాసము** అనబడును.

10. **పరలోకము**:- ఎందు సత్య విద్యవలన పరమేశ్వర ప్రాప్తి జరుగునో, ఆ ప్రాప్తి ద్వారా ఈ జన్మము లేదా పునర్జన్మము నందును మోక్షమునందును పరమసుఖము లభించునో దానినే **పరలోకము** అందురు.

11. **అపరలోకము**:- పరలోకమునకు విరుద్ధమైనది. ఎందు దుఃఖవిశేషము అనుభవింపవలసి యుండునో అది **అపరలోకము** అనబడును.

12. **జన్మము**:-దేనియందు జీవుడు శరీరముతో సంయుక్తుడై కర్మచేయుటకు సమర్థుడగునో దానిని **జన్మము** అందురు.

13. **మరణము**:- ఏ శరీరమును పొంది జీవుడు కర్మ చేయునో, ఆ శరీరమునకు జీవునకు వియోగము కలుగుట **మరణము** అనబడును.

14. **స్వర్గము**:- జీవుడు విశేష సుఖమును, సుఖసామగ్రిని పొందుట **స్వర్గము** అనబడును.

15 **నరకము**:- జీవుడు విశేష దుఃఖమును, దుఃఖసామగ్రిని పొందుట **నరకము** అనబడును.

16. **విద్య**:- దేనివలన ఈశ్వరుడు మొదలుకొని పృథివి వరకు గల పదార్థముల సత్యజ్ఞానము కలిగి వానితో యథాయోగ్యముగ ఉపకారము పొందుట జరుగునో అది **విద్య** అనబడును.

17. **అవిద్య**:- విద్యకు విరుద్ధమైనది, భ్రమ, అంధకార, అజ్ఞాన రూపములు గలది **అవిద్య** అనబడును.

18. **సత్పురుషులు** :- సత్యప్రియులు, ధర్మాత్ములు, విద్వాంసులు, అందరికి మేలు చేయువారు, మహాశయులు **సత్పురుషులు** అనబడుదురు.

19. **సత్సంగము, కుసంగము** :- దేనివలన అసత్యము తొలగి, సత్యమే ప్రాప్తించునో దానిని **సత్సంగము** అందురు. దేనివలన జీవుడు పాపములందు చిక్కుకొనునో దానిని **కుసంగము** అందురు.

20. **తీర్థము**:- విద్యాభ్యాసము, సువిచారము, ఈశ్వరోపాసన, ధర్మానుష్ఠానము, సత్సాంగత్యము, బ్రహ్మచర్యము, జితేంద్రియత్వము మున్నగు ఉత్తమ కర్మలు **తీర్థము** అనబడును. ఏలన వీనివలన జీవులు దుఃఖసాగరమును తరింపగలు గుదురు.

21. **స్తుతి**:- ఈశ్వరుని లేదా ఏదేని పదార్థము యొక్క గుణముల జ్ఞానము, కథనము, శ్రవణము మరియు సత్యభాషణము **స్తుతి** అనబడును.

22. **స్తుతి ఫలము**:- గుణముల జ్ఞానము మొదలగువాని వలన గుణములున్న పదార్థములందు ప్రీతి యేర్పడుట **స్తుతి ఫలము** అనబడును.

23. **నిందా** :- ఏ మిథ్యాజ్ఞానము, మిథ్యాభాషణము, అసత్యమునందు ఆగ్రహము మొదలగు కర్మలవలన గుణములను వదలి వాని స్థానమున అవగుణముల నారోపించుట జరుగునో అది **నిందా** అనబడును.

24. **ప్రార్థనా**:- ఉత్తమ కార్యముల సిద్ధికై పూర్ణపురుషార్థము చేసిన పిదప పరమేశ్వరుని లేదా సామర్థ్యముగల మనుష్యుని సహాయమును తీసికొనుట **ప్రార్థనా** అనబడును.

25. **ప్రార్థనా ఫలము** :- అభిమానము నశించుట, ఆత్మలో ఆర్ద్రత జనించుట. గుణగ్రహణము నందు పురుషార్థము, అత్యంత ప్రీతి కలుగుట **ప్రార్థనా ఫలము** అనబడును.

26. **ఉపాసనా**:- ఈశ్వరుని ఆనందస్వరూపమునందు తన ఆత్మను మగ్నమొనర్చుట **ఉపాసనా** అనబడును.

27. **నిర్గుణోపాసనా** :- పరమాత్ముని శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు, సంయోగ-వియోగములు, తేలిక-భారములు, అవిద్య, జన్మ, మరణ, దుఃఖాది గుణములు లేనివానిగా తెలిసికొని ఉపాసించుట **నిర్గుణోపాసనా** అనబడును.

28. **సగుణోపాసనా** :- ఈశ్వరున్ని సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, శుద్ధుడు, నిత్యుడు, ఆనందమయుడు, సర్వవ్యాపకుడు, ఒకేఒక్కడు,

సనాతనుడు, సర్వకర్త, సర్వాధారుడు, సర్వస్వామీ, సర్వనియంతా, సర్వాంతర్యామీ, మంగళమయుడు, సర్వానందప్రదుడు, సర్వపితా, సమస్త జగత్తును రచించువాడు, న్యాయకారీ, దయాళువు మున్నగు సత్యగుణములు గలవానిగా తెలిసికొని ఉపాసించుట **సగుణోపాసనా** అనబడును.

29. **ముక్తి**:- దేనియందు జీవుడు సమస్త దుష్కర్మలనుండి, జన్మమరణాది దుఃఖసాగరము నుండి వైదొలగి సుఖరూపుడైన పరమేశ్వరుని పొంది సుఖము నందే లీనమై ఉండునో అది **ముక్తి** అనబడును.

30. **ముక్తికి సాధనములు** :- పూర్వోక్త ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసనలు, ధర్మాచరణము, పుణ్యాచరణము, సత్సంగము, విశ్వాసము, తీర్థసేవనము, సత్పురుషుల సాంగత్యము, పరోపకారము, మొదలగు శుభకర్మల నాచరించుట, సమస్త దుష్కర్మలకు దూరముగ నుండుట మొదలగునవన్నియు **ముక్తికి సాధనములు** అనబడును.

31. **కర్త**:- ఎవడు స్వతంత్రముతో కర్మలు చేయునో అనగా ఎవని ఆధీనమందు సమస్త సాధనములు ఉండునో అతడు **కర్త** అనబడును.

32. **కారణము**:- దేనిని గ్రహించియే కర్త ఏదేని కార్యమునుగాని వస్తువును గాని చేయగల్గునో అనగా ఏది లేకున్న ఏ వస్తువుగూడ ఉత్పన్నము కాజాలదో అది **కారణము** అనబడును. అది మూడు రకములు.

33. **ఉపాదాన కారణము** :- దేనిని గ్రహించియే ఏదేని ఉత్పన్నము లేదా సిద్ధము చేయబడునో దానిని **ఉపాదాన కారణము** అందురు. ఉదా :- మట్టితో కుండ సిద్ధమగుట.

34. **నిమిత్త కారణము** :- ఒక వస్తువును చేయువాడు, కుమ్మరివాడు కుండను చేయునట్లు పనులజేయునో ఇటువంటి పదార్థములను **నిమిత్తకారణము** అందురు.

35. **సాధారణ కారణము**:- ఉదాహరణకు చక్రము, దండము మున్నగునవి మరియు దిశ, ఆకాశము, వెలుతురు, వీటినే **సాధారణ కారణము** అందురు.

36. **కార్యము**:- ఒక పదార్థముతో విశేష సంయోగము చెందుట వలన స్థూల రూపము దాల్చి ఉపయోగపడునది, అనగా చేయదగినది. అది ఆ కారణమునకు **కార్యము** అనబడును.

37. **సృష్టి**:- కర్త యొక్క రచనవలన కారణద్రవ్యము ఏదేని సంయోగ విశేషముచే అనేక విధముల కార్యరూపము చెంది వర్తమానమున వ్యవహారమునకు యోగ్యమైనది **సృష్టి** అనబడును.

38. **జాతి**:- జన్మ మొదలు మరణ పర్యంతము ఉండునది, అనేక వ్యక్తులలో ఏకరూపముగ నుండునది. ఈశ్వరునిచే రచింపబడినది అనగా మనుష్యుడు, ఆవు, గుల్మము, వృక్షము మున్నగువాని సమూహములు-ఇవి **జాతి** శబ్దార్థమున గ్రహింప బడును.

39. **మనుష్యుడు**:- ఆలోచించనిదే ఏ పనినైనను చేయనివాడిని **మనుష్యుడు** అందురు.

40. **ఆర్యులు** :- శ్రేష్ఠ స్వభావము గలవారు, ధర్మాత్ములు, పరోపకారులు, సత్యవిద్యాదిగుణయుక్తులు మరియు ఆర్యావర్త దేశమున ఎల్లప్పుడు ఉండువారినే **ఆర్యులు** అందురు.

41. **ఆర్యావర్త దేశము** :- హిమాలయము, వింధ్యాచలము, సింధూ నది, బ్రహ్మపుత్రా నది ఈ నాల్గింటి మధ్యను వీటి విస్తారమున్నంతవరకును గల దేశము **ఆర్యావర్తము** అనబడును.

42. **దస్యుడు** :- అనార్యుడు అనగా అజ్ఞాని, ఆర్యుని స్వభావమునకు, వారి నివాసములకు వేరుగా నుండువాడు, బందిపోటు, దొంగ హింసకుడు అగు దుష్ట మనుష్యుడు **దస్యుడు** అనబడును.

43. **వర్ణము** :- గుణకర్మల యోగముచే గ్రహింపబడునదే **వర్ణ** శబ్దార్థమగును.

44. **వర్ణ భేదములు**:- బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాదులు **వర్ణము** లనబడును.

45. **ఆశ్రమము**:- దేనియందు అత్యంత పరిశ్రమచే ఉత్తమ గుణములను గ్రహించి శ్రేష్ఠకర్మలు చేయబడునో వానిని **ఆశ్రమము** అందురు.

46. **ఆశ్రమ భేదములు** :- సద్విద్యాది శుభగుణములను గ్రహించుటకు జితేంద్రియత్వము ద్వారా ఆత్మ, శరీరముల

బలమును పెంపొందించుటకు బ్రహ్మచర్యము, సంతానోత్పత్తికి, విద్యాది సమస్త వ్యవహారములను సిద్ధింపజేసి కొనుటకు గృహాశ్రమము, మననము చేయుటకు వానప్రస్థము, అందరికి ఉపకారము చేయుటకు సంన్యాసాశ్రమము, ఇవియే నాలుగు **ఆశ్రమములు** అనబడును.

47. **యజ్ఞము :-** అగ్నిహోత్రము మొదలుకొని అశ్వమేధ పర్యంతము, జగత్తుయొక్క ఉపకారము కొరకు చేయబడు శిల్పవ్యవహారము, పదార్థ విజ్ఞానము **యజ్ఞము** అనబడును.

48. **కర్మ:-** మనస్సు, ఇంద్రియములు, శరీరము వీనియందు జీవుడు చేయు చేష్టావిశేషమే **కర్మ** అనబడును. అది శుభము, అశుభము, మిశ్రమము అని మూడు విధములు.

49. **క్రియమాణము :-** వర్తమానమున చేయబడుచున్నది **క్రియమాణము** అనబడును.

50. **సంచితము :-** మన జ్ఞానమున అంకితమై యుండు క్రియమాణపు సంస్కారము **సంచితము** అనబడును.

51. **ప్రారబ్ధము:-** పూర్వము చేయబడిన కర్మల సుఖదుఃఖరూప ఫలభోగము **ప్రారబ్ధము** అనబడును.

52. **అనాది పదార్థములు :-** ఈశ్వరుడు, జీవుడు, జగత్ కారణము ఈ మూడు స్వరూపము చేత **అనాదులు.**

53. **ప్రవాహముచేత అనాది పదార్థములు:-** కార్యజగత్తు, జీవుని కర్మలు మరియు వీని సంయోగ-వియోగములు ఈ మూడు **పరంపరచే అనాదులు.**

54. **అనాది యొక్క స్వరూపము**:- ఎన్నడును ఉత్పన్నము కానిది. కారణమేదియు లేనిది అనగా సదా స్వయంసిద్ధమైనది **అనాది** అనబడును.

55. **పురుషార్థము** :- సర్వథా ఆలస్యమును వదలి ఉత్తమ వ్యవహారముల సిద్ధికొరకు మనస్సు, శరీరము, వాణీ మరియు ధనముద్వారా అత్యంత ప్రయత్నము చేయుట **పురుషార్థము** అనబడును.

56. **పురుషార్థ భేదములు**:- అప్రాప్తవస్తువును ప్రాప్తింపగోరుట, ప్రాప్తించిన దానిని చక్కగా రక్షించుట, రక్షించిన దానిని వృద్ధిచేయుట, వృద్ధియైన పదార్థములను సత్యవిద్యల ఉన్నతికొరకును అందరి మేలుకొఱకును వ్యయము చేయుట అను ఈ నాల్గు విధముల కర్మలను **పురుషార్థము** అందురు.

57. **పరోపకారము**:- తన సర్వసామర్థ్యముతో ఇతర ప్రాణుల సుఖము కొరకు తనుమనోధనములతో ప్రయత్నించుట **పరోపకారము** అనబడును.

58. **శిష్టాచారము**:- శుభగుణములను గ్రహించుట, అశుభ గుణములను త్యజించుట **శిష్టాచారము** అనబడును.

59. **సదాచారము**:- సృష్టి మొదలుకొని నేటివరకు కొనసాగుచు వచ్చుచున్న సత్పురుషుల వేదోక్త ఆచారమును, కేవలము సత్యాచరణమును, అసత్య పరిత్యాగమును **సదాచారము** అందురు.

60. **విద్యాపుస్తకము** :- ఈశ్వరోక్త, సనాతన, సత్యవిద్యా మయములైన నాలుగు వేదములు **విద్యాపుస్తకములు** అనబడును.

61. **ఆచార్యుడు**:- శ్రేష్ఠమైన ఆచారమును గ్రహింపజేసి, సమస్త విద్యలను చదివించువాడు **ఆచార్యుడు** అనబడును.

62. **గురువు**:- వీర్యదానము మొదలుకొని భోజనాదులొసగి పాలించుట వలన తండ్రిని **గురువు** అని అందురు. సత్యోపదేశము చేత హృదయమందలి అజ్ఞానాంధకారమును నశింపజేయువానిని కూడ **గురువు** అంటే **ఆచార్యుడు** అని అందురు.

63. **అతిథి** :- రాకపోకలలో నిశ్చితమైన తిథి ఏదియును లేనివాడు, విద్వాంసుడై సర్వత్ర భ్రమణము చేయుచు ప్రశ్నోత్తరముల ద్వారా ఉపదేశించి సమస్త జీవులకు ఉపకారము చేయువాడు **అతిథి** అనబడును.

64. **పంచాయతన పూజ** :- జీవిత మాతాపితరులను, ఆచార్యున్ని, అతిథిని, పరమేశ్వరున్ని యథాయోగ్యముగ సత్కరించి ప్రసన్నులను చేయుట **పంచాయతన పూజ** అనబడును.

65. **పూజ**:- జ్ఞానాది గుణములు గలవారిని యథాయోగ్యముగ సత్కరించుట **పూజ** అనబడును.

66. **అపూజ**:- జ్ఞానాది గుణరహిత జడపదార్థములను మరియు సత్కార యోగ్యము కానివారిని సత్కరించుటయే **అపూజ** అనబడును.

67. **జడము** :- జ్ఞానాది గుణములులేని వస్తువు **జడము** అనబడును.

68. **చేతనము**:- జ్ఞానాది గుణములతో కూడియున్న పదార్థము **చేతనము** అనబడును.

69. **భావన**:- ఒక పదార్థమును ఆలోచించి ఉన్నదాని నున్నట్లుగ నిశ్చయించుట, దాని విషయమున భ్రమ లేకుండుట అనగా ఎటువంటి దానిని అటువంటిదిగనే గ్రహించుట **భావన** అనబడును.

70. **అభావన** :- భావనకు విరుద్ధమైనది, అనగా మిథ్యా జ్ఞానముచే ఒక దానిని ఇంకొకటిగా నిశ్చయించుట, ఉదాహరణకు-జడమునందు చేతనమును, చేతనమందు జడమును నిశ్చయించుట **అభావన** అనబడును.

71. **పండితుడు**:- వివేకముతో సత్-అసత్‌ను తెలిసికొనువాడు, ధర్మాత్ముడు, సత్యవాదీ, సత్యప్రియుడు, విద్వాంసుడు, అందరికి మేలు చేయువాడు **పండితుడు** అనబడును.

72. **మూర్ఖుడు** :- అజ్ఞానము, హఠము, దురాగ్రహము మున్నగు దోషములతో కూడియున్న వానిని **మూర్ఖుడు** అందురు.

73. **జ్యేష్ఠ కనిష్ఠ వ్యవహారము** :- పెద్దలు, పిన్నలు యథా యోగ్యముగ పరస్పరము గౌరవించుకొనుట **జ్యేష్ఠకనిష్ఠవ్యవహారము** అనబడును.

74. **సర్వహితము**:- తనుమనోధనములతో అందరి సుఖవృద్ధి కొరకు ప్రయత్నించుట **సర్వహితము** అనబడును.

75. **చౌర్య త్యాగము**:- యజమాని అనుమతి పొందక ఒకరి పదార్థమును గ్రహించుట **చౌర్యము** దానిని (చౌర్యమును) వదలివేయుట **చౌర్య త్యాగము** అనబడును.

76. **వ్యభిచార త్యాగము** :- తన భార్యతప్ప ఇతర స్త్రీలతో సహవాసము, తనభార్యతో గూడ ఋతుకాలము కాని సమయమున

వీర్యదానము, తన భార్యతో గూడ వీర్యమును ఎక్కువగా నాశము చేయుట, యువావస్థకు పూర్వమే వివాహము చేసికొనుట ఇవన్నియు **వ్యభిచారము** అనబడును. వీనిని విసర్జించుట **వ్యభిచార త్యాగము** అనబడును.

77. **జీవుని స్వరూపము**:- చేతనుడు, అల్పజ్ఞుడు, ఇచ్ఛా, ద్వేష, ప్రయత్న, సుఖ, దుఃఖ, జ్ఞాన గుణములు గలవాడు, నిత్యుడు అయినవాడు **జీవుడు** అనబడును.

78. **స్వభావము**:- వస్తువు ఉన్నంతవరకు దానిని వీడకుండగా దానిలో ఉండు స్వాభావిక గుణము **స్వభావము** అనబడును. ఉదాహరణకు అగ్నిలో ఉండు రూపము, వేడిమి.

79. **ప్రళయము**:- కార్యజగత్తు కారణ రూపము చెందుట అంటే జగత్తును రచించు ఈశ్వరుడు ఏయే కారణములచేత సృష్టిని ఉత్పన్నము చేయునో, అనేక కార్యములను రచించి, యథావిధి పాలించి, తిరిగి కారణ రూపములోనికి మార్చి వేయునో దాని పేరు **ప్రళయము**.

80. **మాయావీ**:- ఛలము, కపటము, స్వార్థమునందే ప్రసన్నత, దంభము, అహంకారము, శఠత్వము మున్నగు దోషములు మాయ అనబడును. వీటిని కలిగి యున్న మనుష్యుడు **మాయావీ** అనబడును.

81. **ఆప్తుడు**:- ఛలము మున్నగు దోషములు లేనివాడు, ధర్మాత్ముడు, విద్వాంసుడు, సత్యోపదేశము చేయువాడు, అందరిపై కృపాదృష్టి కలిగియుండి, అవిద్యాంధ కారమును నశింపజేసి అజ్ఞాన

జనుల ఆత్మలందు విద్యారూప సూర్యుని ప్రకాశమును సదా కలిగించువాడు **ఆప్తుడు** అనబడును.

82. **పరీక్ష:**- ప్రత్యక్షాది ఎనిమిది ప్రమాణములకు, వేదవిద్య, ఆత్మ పరిశుద్ధి మరియు సృష్టి క్రమమునకు అనుకూలముగ విచారించి సత్యాసత్యమును యథాతథముగ నిశ్చయించుట **పరీక్ష** అనబడును.

83. **అష్ట ప్రమాణములు :**- ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, ఐతిహ్యము, అర్థాపత్తి, సంభవము, అభావము ఇవి **ఎనిమిది ప్రమాణములు.** వీటి ద్వారానే మనుష్యుడు సమస్త సత్యాసత్యములను యథాతథముగ నిశ్చయింపగలుగును.

84. **లక్షణము:**- ఏ స్వాభావిక గుణముల ద్వారా లక్ష్యము తెలియునో దానిని **లక్షణము** అందురు. ఉదాహరణకు రూపము ద్వారా అగ్ని తెలియును.

85. **ప్రమేయము :**- ప్రమాణములచే తెలిసికొనబడునది, ఇంద్రియముల ద్వారా ప్రతీత మగునది **ప్రమేయము** అనబడును. ఉదాహరణకు కంటి ప్రమేయము రూపమనెడు అర్థము.

86. **ప్రత్యక్షము:**- ప్రసిద్ధములైన శబ్దాది పదార్థములతో శ్రోత్రాది ఇంద్రియ ములకు, మనస్సునకు ఏర్పడు దగ్గరి సంబంధము వలన కలుగు జ్ఞానము **ప్రత్యక్షము** అనబడును.

87. **అనుమానము:**- పూర్వము చూచిన ఒకానొక పదార్థపు ఒక అవయవమును ప్రత్యక్షముగ చూచిన పిదప దాని కనిపించని

అవయవముల యథార్థజ్ఞానము దేనివలన కలుగునో దానిని **అనుమానము** అందురు.

88. **ఉపమానము** :- ఆవువలనే గవయము (అడవి ఆవు) ఉండునని ఒకడు మరొకనితో ననగా తుల్య ఉపమవలన (గవయ) జ్ఞానము కలుగును. దానిని **ఉపమానము** అందురు.

89. **శబ్దము** :- పూర్ణ ఆప్తుడైన పరమేశ్వరుని మరియు పూర్వోక్త ఆప్తమనుష్యుని ఉపదేశమునే **శబ్దప్రమాణము** అందురు.

90. **ఐతిహ్యము** :- శబ్దప్రమాణమునకు అనుకూలమై అసంభవము, అతస్యముకాని వ్రాత **ఐతిహ్యము, ఇతిహాసము** (చరిత్ర) అనబడును.

91. **అర్థాపత్తి** :- ఒక విషయమును పేర్కొన్నప్పుడు తెలియని వేరొక విషయము గ్రహింపబడుటయే **అర్థాపత్తి** అనబడును.

92. **సంభవము** :- ప్రమాణము, యుక్తి, సృష్టిక్రమములతో కూడినది **సంభవము** అనబడును.

93. **అభావము** :- ఒక వ్యక్తి మరొకనితో జలము తీసుకరమ్మనెను. అతడు అచట జలము లేనందున జలమున్న చోటికి వెళ్ళి తీసుకరావలెననుకొనును అభావ నిమిత్తము వలన కలుగు ఈ జ్ఞానము **అభావ ప్రమాణము** అనబడును.

94. **శాస్త్రము** :- సత్యవిద్యల ప్రతిపాదనతో కూడియుండి మనుష్యులకు కేవలము సత్యమైన జ్ఞానమును కలుగజేయునది **శాస్త్రము** అనబడును.

95. **వేదములు**:- ఈశ్వరోక్తములై సత్యవిద్యలతో కూడి మనుష్యులకు సత్యజ్ఞాన మును కలుగజేయు ఋక్ సంహిత మొదలగు నాలుగు పుస్తకములు **వేదములు** అనబడును.

96. **పురాణములు**:- ఋషులు, మునులు రచించిన ఐతరేయ, శతపథ బ్రాహ్మణాది సత్యార్థముల ప్రాచీన పుస్తకములనే **పురాణములు, ఇతిహాసము, కల్పము, గాథ, నారాశంసీ** అందురు.

97. **ఉపవేదములు**:- అయుర్వేద మనబడు వైద్యశాస్త్రము, ధనుర్వేద మనబడు శస్త్రాస్త్ర విద్య మరియు రాజధర్మము, గాంధర్వవేదమనబడు గానశాస్త్రము, అర్థవేద మనబడు శిల్పశాస్త్రము–ఈ నాల్గిందిని **ఉపవేదములు** అందురు.

98. **వేదాంగములు**:- శిక్షా, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషములనబడు సనాతన అర్షశాస్త్రములను **వేదాంగములు** అందురు.

99. **ఉపాంగములు**:- ఋషులు, మునులు రచించిన మీమాంసా, వైశేషిక, న్యాయ, యోగ, సాంఖ్య వేదాంతము లనబడు అరు శాస్త్రములను **ఉపాంగములు** అందురు.

100. **నమస్తే**:- నేను మిమ్ము ఆదరించుచున్నాను.

**వేదరామాంకచంద్రేబ్దే విక్రమార్కస్య భూపతేః।**
**సభస్యే సితసప్తమ్యాం సౌమ్యే పూర్తి మగాదియమ్॥**

శ్రీయుత మహారాజ విక్రమాదిత్యుని 1934వ సంవత్సరమున శ్రావణ మాసపు శుక్ల పక్షము సప్తమీ బుధవారము నాడు స్వామి దయానంద సరస్వతీ గారిచే అర్యభాషలో సమస్త మానవుల హితార్థము ఈ ఆర్యోద్దేశ్యరత్నమాలా పుస్తకము రచింపబడెను.